# వివాహ ప్రకరణమ్



## కన్యాదాతకు భార్య దక్షిణమున ఉండవలసిన సమయములు

శ్లో॥ పూజనే మధుపర్కేచ కన్యాదానే తథైవచ।
కర్మస్వే తేషువై భార్యాం దక్షిణే తూపవేశయేత్ ॥

వరునిపూజించుసమయముననూ, మధుపర్కముఇచ్చునపుడునూ, కన్యాదాన కాలమందునూ కన్యాదాత భార్య, కన్యాదాతకు కుడిచేతివైపున ఉండవలెను.

## వధువు వరునకు ఉత్తరమున ఉండవలసిన సమయములు

శ్లో॥ పుణ్యాహవాచనేచైవ సంకల్పేషు తథైవచ।
ఆశీర్వచన కాలేచ నిత్యోపాసన కర్మణి।
రక్షాబంధన కాలేచ పత్నీయోక్త్ర విమోచనే।
ఏతేషూత్తరత స్తిష్ఠే ద్వధూరన్యత్ర దక్షిణే॥
ఆవాంకర్మణి నిత్యహోమ సమయే పుణ్యాహసంకల్పయోః।
స్థాల్యాగ్రయణ యోక్త్రమోచన పునస్సంధాన శయ్యోత్సవే।
ఏతేష్వా ద్యచరౌచ విప్రపఠితా స్వాశీష్షు రక్షాధృతౌ।
తిష్ఠే దుత్తరతో వధూ స్మృతివశా దన్యత్రచ దక్షిణే॥

పుణ్యాహవాచనము, సంకల్పములు, ఆశీర్వచనకాలము, నిత్యోపాసనము, రక్షాబంధనము, యోక్త్రవిమోచనము, ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని అను వాక్యము పఠించునపుడును, స్థాలీపాకము, అగ్రయణము, పునస్సంధానము, శయ్యోత్సవముఅను ఈకర్మలన్నిటియందును, వరునకు ఎడమవైపువధువు ఉండవలెను. మిగిలిన సమయములందు వరునకు కుడివైపువధువు ఉండవలెను.

## వరుడు పశ్చిమముఖముగా కూర్చుండవలసిన సమయములు

శ్లో॥ పాదప్రక్షాళనేచైవ మధుపర్కస్య ప్రాశనే।
కన్యాస్వీకృతి కాలేతు శోభనద్రవ్యధారణే।
భ్రువోర్మార్జన కాలేచ కన్యామూర్ధ్న్యభిషేచనే ।
యోక్త్రస్యావేష్టనేకాలే మాఙ్గల్యస్యచ ధారణే ।
వధ్వా స్తండుల సంప్రాప్తౌ వరో వారుణ దిఙ్ముఖః ॥

కాళ్లుకడుగునపుడు, మధుపర్కమును,కన్యను స్వీకరించునపుడు, జీలకర్ర, బెల్లము ధరించునపుడు, యుగచ్ఛిద్రాభిషేకము చేయుసమయమున, వధువు నడుముకు దర్భత్రాడును, మంగళసూత్రము కట్టునపుడు, తలంబ్రాలు పోసుకొనునపుడు, వరుడుపడమరవైపునకు తిరిగిఉండవలెను.

శ్లో॥ సంస్కార్యః పురుషోవాపి స్త్రీవా దక్షిణతోభవేత్ ।
సంస్కారకస్తు సర్వత్ర తిష్ఠేదుత్తరతస్సదా ॥

సంస్కరింపబడువారు పురుషుడైననూ స్త్రీయైననూ దక్షిణమున ఉండవలెను. సంస్కరింపువారెప్పుడూ ఉత్తరమునఉండవలెను.





ధర్మసంతతికై కన్యను స్వీకరించుటకు చేయుకర్మయే

# పాణిగ్రహణమ్



## మంగళస్నానమ్

ముందుగా వధూవరులకు విడి,విడిగా మఙ్గళస్నానము చేయించవలెను.

సూ॥ ముహూర్తసమయే వరో మఙ్గళస్నానం కృత్వా।
పూర్వమేవ వధూం మఙ్గళస్నానం కారయిత్వా॥

## సంకల్పః

వరుడు ఫలదక్షిణ తాంబూలములను చేతపట్టి, మమాగ్నే అనువాకమును పఠించి, పిమ్మటక్రిందిమంత్రముచెప్పి సరస్వతీదేవినిప్రార్థించి, వరుడు పెండ్లిపీటపై కూర్చొనవలెను. సభాసదులు, పెద్దలు వరుని శిరస్సుపై అక్షతలువేసిన పిమ్మట బ్రహ్మగారికి ఫల,దక్షిణ,తాంబూలములను ఈయవలెను.

తదుపరి వరుడు సభకు నమస్కరించి, ఆచమనముచేసి, విఘ్నేశ్వరపూజ

పుణ్యాహవాచనములను చేయవలెను.

మమాగ్నే ..... మేదినన్వా ॥

దేవీంవాచ మజనయన్త దేవాస్తాం విశ్వరూపాః పశవోవదన్తి ।

సానోమన్ద్రేష మూర్జందుహానా ధేనుర్వాగస్మాను పసుష్టుతైతు ॥

అయం ముహూర్తస్సుముహూర్తో ఽస్తు ॥ సభాయైనమః ॥

ఆచమ్య....శ్రీకృష్ణాయనమః॥ యశ్శివోనామరూపాభ్యాం.....

ప్రాణానాయమ్య....శ్రీపరమేశ్వరప్రీత్యర్థమ్ । పాణిగ్రహణాఖ్యంకర్మకరిష్య మాణస్తదఙ్గత్వేన తదాదౌశుద్ధ్యర్థం వృద్ధ్యర్థంశాన్త్యర్థ మభ్యుదయార్థఇచ్ఛ మహాజనైస్సహ స్వస్తిపుణ్యాహవాచనంకరిష్యే॥ ఆదౌనిర్విఘ్నపరి సమాప్త్యర్థం శ్రీమహాగణాధిపతిపూజాంకరిష్యే ॥

గణపతిపూజాంకృత్వా । పుణ్యాహంవాచయిత్వా ॥

తదుపరి వరుడు తనకాళ్ళుకడుగుకొని, ఆచమనము చేయవలెను.

వరః పాదౌప్రక్షాళ్య ॥ ఆచమ్య ॥

## కన్యావరణవిధిః

పిమ్మట వరుడుప్రాణాయామముచేసి, పాణిగ్రహణమునకుసంకల్పించి, తననిమిత్తము యోగ్యమైనకన్యను వెదకికొనిరమ్మని, మంచిహృదయము కలమిత్రులు, ఉభయపక్షములక్షేమముకోరు వేదవేత్తలు,ఆలోచనాపరులైన నలుగురుబ్రాహ్మణులకు "మదర్థం కన్యాం వృణీధ్వ" మని వారికిదారిఖర్చులనిమిత్తము యథాశక్తి దక్షిణను ఇచ్చిపంపుటఆచారము దీనినే కన్యావరణమందురు.

ప్రాణానాయమ్య....శ్రీపరమేశ్వరప్రీత్యర్థం పాణిగ్రహణాఖ్యం కర్మ కరిష్యే । పాణిగ్రహణాఙ్గత్వేన కన్యావరణార్థం వరాన్ ప్రేషయిష్యే ॥

సూ॥ సుహృదస్సమవేతాన్ మన్త్రవతో వరాన్ప్రహిణుయాత్ ॥

మదర్థం కన్యాం వృణీధ్వం ఇతిచతురోవరాన్ ప్రేషయతి ॥

పిమ్మటవరుడు ఆనలుగురుబ్రాహ్మణులనుఉద్దేశించి, క్రిందిరెండు మంత్రములు చెప్పవలెను.

సూ॥ తానాదితో ద్వాభ్యా మభిమన్త్రయేత ॥

ప్రసుగ్మన్తా ధియసానస్యసక్షణి వరేభి ర్వరాగ్ం అభిషుప్రసీదత।
అస్మాకమిన్ద్ర ఉభయం జుజోషతి యథ్సౌమ్యస్యాన్ధసో బుబోధతి ॥
అనృక్షరా ఋజవస్సన్తు పన్థాయేభి స్సఖాయో యన్తినో వరేయమ్।
సమర్యమా సంభగోనోనినీయా థ్సంజాస్పత్యగ్ం సుయమమస్తుదేవాః॥

కన్యనువెదకువారు క్రిందిశాకునమంత్రములను చెప్పుచూవారుకన్యాదాతను సమీపించవలెను.

## శాకునమంత్రాః

అనుహవం పరిహవం పరీవాదం పరిక్షపమ్। దుస్స్వప్నం దురుదితం తద్విషద్భ్యోదిశామ్యహమ్। అనుహూతం పరిహూతగ్ం శకునే ర్యదశాకునమ్। మృగస్య శృత మక్ష్ణయా తద్విషద్భ్యో దిశామ్యహమ్। ఆరాత్తే అగ్నిరస్త్వారా త్పరశు రస్తుతే। నివాతే త్వాభి వర్షతు స్వస్తితేస్తు వనస్పతే స్వస్తిమేస్తు వనస్పతే। నమ శ్శకృథ్సదే రుద్రాయ నమోరుద్రాయ శకృథ్సదే। గోష్ఠమసి నమస్తే అస్తు మామాహిగ్ంసీ స్సిగసినసి వజ్రో నమస్తే అస్తు మామా హిగ్ంసీః।ఉద్గాతేవశకునే సామగాయసి బ్రహ్మపుత్ర ఇవసవనేషు శగ్ంససి। స్వస్తిన శ్శకునే అస్తు ప్రతిన స్సుమనాభవ ॥

శాకునమన్త్రై స్తే కన్యాదాతారం గత్వా బ్రువతే॥

పిమ్మట కన్యాన్వేషకులుకన్యాదాతసమక్షములో వరుని గోత్రప్రవరాదులను చెప్పి, వరుని ధర్మసంతతికొరకు కన్యనుఇవ్వమని కోరవలెను.

## వరగోత్ర ప్రవరపఠనమ్

చతుస్సాగరపర్యన్తం గోబ్రాహ్మణేభ్యశ్శుభంభవతు॥ కాశ్యపా వత్సార నైధ్రువత్రయా ఋషేయప్రవరాన్విత కాశ్యపస గోత్రస్య॥ కేశవ (వరుని ముత్తాత గారిపేరు) శర్మణో నప్త్రే ॥

కాశ్యపా..గోత్రస్య....నారాయణ (వరునితాతగారిపేరు) శర్మణః పౌత్రాయ॥

కాశ్యపా..గోత్రస్య....మాధవ(వరుని తండ్రిపేరు)శర్మణఃపుత్రాయ॥

కాశ్యపా..గోత్రోద్భవాయ శ్రీనివాస (వరునిపేరు) శర్మణే వరాయ॥

పిమ్మట కన్యాదాత కన్యాన్వేషకులను ఉద్దేశించి, తన గోత్ర ప్రవరాదులను చెప్పి, కన్యనుఇచ్చెదనని పలుకవలెను.

## కన్యాగోత్ర ప్రవరపఠనమ్

చతుస్సాగర పర్యన్తం గోబ్రాహ్మణేభ్యశ్శుభం భవతు ॥

ఆఙ్గీరస ఆయాస్య గౌతమ త్రయాఋషేయ ప్రవరాన్విత గౌతమసగోత్రస్య॥ గోవింద (వధువు ముత్తాతగారి పేరు) శర్మణోనప్త్రీం ।

ఆఙ్గీరస....గోత్రస్య విష్ణు (వధువు తాతగారిపేరు) శర్మణః పౌత్రీమ్ ॥

ఆఙ్గీరస....గోత్రస్య మధుసూదన (వధువుతండ్రిపేరు)శర్మణఃపుత్రీమ్॥

ఆఙ్గీరస....గోత్రోద్భవాం లక్ష్మీ (వధువుపేరు)నామ్నీంకన్యామ్॥

"ధర్మకార్యముల నిమిత్తమునూ, సంతాన నిమిత్తమున్నూ ఈకన్యనుకోరు చున్నాము." అనివరుడు పంపినవారు పలుకవలెను.

ధర్మప్రజా సంపత్త్యర్థం వృణీమహే ॥

"వరింపుడు, అతని కొరకు ఈకన్యను ఇచ్చుచున్నాను." అని దాతమూరు పలుకవలెను. ఇట్లు ఉభయవర్గముల వారు ప్రవరలు, వచన, ప్రతివచనములు మూడుమార్లు చెప్పవలెను.

దాతా ॥ వృణీధ్వం తస్మైదాస్యామీతి ప్రతిబ్రూయాత్ । ఏవంత్రిః ॥

పిమ్మట ఆనలుగురుబ్రాహ్మణులూ వరునివద్దకువచ్చి, "మేము కృతార్థుల మైతిమి, కన్యనునిశ్చయించివచ్చితిమి" అనివరునితోపలుకవలెను.

బ్రాహ్మణాః ॥ కృతార్థావయమితి వరమావేదయేయుః।

## కన్యాదాతృ కృత్యమ్

కన్యాదాతపత్నీసమేతుడై - మఙ్గళస్నానముచేసి, శుభ్రవస్త్రములను ధరించి, భూషణములచే అలంకరింపబడిన కన్యకతోసహా ఫలదక్షిణ తాంబూలములను చేతపట్టి, కూర్చొని సంకల్పించి విఘ్నేశ్వరపూజను, పుణ్యాహవాచనములను, రక్షాబంధనమునుచేసి, అంకురారోపణము, నాందీదేవతాహ్వానము, ఆభ్యుదయక, కర్మణఃపుణ్యాహవాచనములనుచేసి, కన్యకచే గౌరీపూజనుచేయించవలెను.

కన్యాదాతాసపత్నీకః కృతమఙ్గళస్నానాం, శుచివాససం, స్వలఙ్కృతాంకన్యాం స్వసన్నిధౌ ఉపవేశ్య ॥

కన్యాదాతా ॥ మమాగ్నే....సుష్టుతైతు ॥ ఆచమ్య....శ్రీకృష్ణాయ నమః॥ ప్రాణానాయమ్య....శ్రీపరమేశ్వరప్రీత్యర్థం మయా కరిష్యమాణ కన్యా వివాహాఖ్యం కర్మకరిష్యమాణస్తదఙ్గత్వేన తదాదౌశుద్ధ్యర్థం వృద్ధ్యర్థం శాన్త్యర్థమభ్యుదయార్థఞ్చ మహాజనైస్సహస్వస్తిపుణ్యాహవాచనంకరిష్యే॥ ఆదౌనిర్విఘ్నపరిసమాప్త్యర్థం శ్రీమహాగణాధిపతిపూజాంకరిష్యే ॥

గణపతిపూజాంకృత్వా । పుణ్యాహంవాచయిత్వా । రక్షాంబధ్వా॥

అఙ్కురారోపణ, నాన్దీదేవతాహ్వానంచవిధాయ। యథాకాలమాభ్యు దయక, కర్మణఃపుణ్యాహవాచనంచకృత్వా। కన్యయాగౌరీపూజాంకారయేత్॥

## వర కృత్యమ్

వరుడు ప్రాణాయామముచేసి, ధర్మకార్యములనిమిత్తము స్త్రీనిపెండ్లి చేసుకొనుచున్నాను అనిసంకల్పించవలెను.

వరఃప్రాణానాయమ్య....శ్రీపరమేశ్వరప్రీత్యర్థం ధర్మప్రజా సంపత్త్యర్థగ్స్త్రియయ ముద్వహే॥

## యజ్ఞోపవీత ధారణమ్

వరుడు వివాహాంగమైనయజ్ఞోపవీతధారణకు సంకల్పించి, యజ్ఞోపవీతమును షోడశోపచారములచే పూజించవలెను.

**ఈ యజ్ఞోపవీతము కన్యాదాతలు వేయుట ఆచారము.**

పునః ప్రాణానాయమ్య....శ్రీపరమేశ్వరప్రీత్యర్థం ఉద్వాహాఙ్గభూత ద్వితీయయజ్ఞోపవీతధారణం కరిష్యే॥ యజ్ఞోపవీతం సంపూజ్య॥

వరుడు క్రిందిమంత్రమునుచెప్పి, యజ్ఞోపవీతమునుధరించి మరల ఆచమనముచేయవలెను. పిమ్మటసభాసదులు వరునిశిరస్సుపైఅక్షతలువేయవలెను.

ఆచమ్య.... ఓంయజ్ఞోపవీతం పరమంపవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్। ఆయుష్యమగ్ర్యం ప్రతిముఞ్చ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః। ధృత్వా ఉ ఉ చమ్య॥

యజ్ఞోపవీతధారణ ముహూర్తస్సుముహూర్తోఽస్తు॥

తరువాత వరుడు పశ్చిమముఖముగా కూర్చుండవలెను.

వరునకు కన్యకనబడకుండా ఇరువురిమధ్యలో తెరనుపట్టవలెను.

కన్యా వరయోర్మధ్యే అన్తఃపటలంకృత్వా॥



## కన్యాదానమ్

వివాహవేదికపై కన్యాదాతలు తూర్పుముఖముగా కూర్చుండవలెను. కట్టు లేని వెదురుపేళ్ళ బుట్టలోబియ్యము పోసి, దానిపై నూతన వస్త్రమువేసి ఆబుట్టలో కన్యను కూర్చుండచేసి, కన్యను కన్యమేనమామ తీసుకొనివచ్చి కన్యాదాతభార్య కు ఎడమవైపునకూర్చుండబెట్టవలెను.

వరుడు కన్యమేనమామకు నూతనవస్త్రములను ఇచ్చుట ఆచారము. తరువాత కన్యాదాత కన్యాదానమునకు సంకల్పముచేయవలెను.

(మహానదీస్నాన, విశేషదాన, యజ్ఞ, వ్రతాదులయందు మహాసంకల్పము ను పఠించుటవలన అనంతమైన పుణ్యములభించునని ఆర్షవచనము.)

దాతా ప్రాణానాయమ్య....శ్రీపరమేశ్వరప్రీత్యర్థం శ్రీలక్ష్మీ నారాయణ దేవతాముద్దిస్య లక్ష్మీనారాయణదేవతాప్రీత్యర్థం సాలజ్కృత కన్యా దానమహం కరిష్యే। కన్యాదానాజ్ఞత్వేన మహాసంకల్ప మన్త్రపఠనం కరిష్యే॥ మహాసంకల్పముచ్చార్య॥

# మహాసంకల్పమ్

అస్యశ్రీమద్భగవతో మహాపురుషస్య। అనంత వీర్యస్య। శ్రీమదాది నారాయణస్య। అచిన్త్యాఽ పరిమిత శక్త్యాభ్రియమాణస్య మహాజలౌఘ మధ్యే, పరిభ్రమమాణానా మనేకకోటి బ్రహ్మాండానా మేకతమే వ్యక్తాఽ వ్యక్త మహదహంకార పృథివ్యాపస్తేజోవాయు రాకాశాద్యావరణైరావృతే స్మిన్మహతి ।।

బ్రహ్మాండఖండయోర్మధ్యే, సకలాధిష్ఠాన వరాహదంష్ట్రాఙ్కుర మృణాలస్య జగన్మూలాధారశక్తిః కూర్మానంతాద్యైరావత పుండరీక వామన కుము దాఞ్జన పుష్పదన్త సార్వభౌమ సుప్రతీకాఖ్యాష్ట దిగ్గజోపరి ప్రతిష్ఠితస్య ॥

అతల వితల సుతల తలాతల రసాతల మహాతల పాతాళ సప్త పాతాళస్యోపరితలే ! భూలోక భువర్లోక సువర్లోక మహర్లోక జనోలోక తపోలోక సత్యలోక స్యాధోభాగే ! చక్రవాళశైల మహావలయమధ్యే వర్తిన్యాం మహానాళాయమాన ఫణిరాజస్యశేషస్య సహస్రఫణాఫణిమండల మండితే!

ఇంద్రాగ్ని యమ నిర్ఋతి వరుణ వాయు కుబేర ఈశానాద్యష్ట దిక్పాలక పాలితే ! లోకా లోకాచల వలయితే ! వలయాకార లవణేక్షు సురా సర్పి దధిక్షీర శుద్ధజలార్ణవై రావృతేస్మిన్ మహతి॥

జంబూప్లక్ష శాల్మలి కుశక్రౌంచ శాకపుష్కరాఖ్యై స్సప్తభిర్ద్వీపై ర్దీపితే। మహేన్ద్ర మలయ సహ్య శుక్తి మదృక్షవ ద్విన్ధ్య పారియాత్రాఖ్య సప్తకుల పర్వతై ర్విరాజితే !!

మతఙ్గ హిరణ్యశృఙ్గాది పంచభిర్మహానగై స్సమధిష్ఠితే! హిమశైల హేమకూటాది సప్తభిర్మహానగై స్సమధిష్ఠితే ! ఇన్ద్ర కశేరు తామ్ర గభస్తి నాగ సౌమ్య గంధర్వ శర భరతఖండాఖ్య నవఖండాత్మకే !!

మహాసరోరుహాకార పంచాశత్కోటి విస్తీర్ణ భూమండల మధ్యే! మేరో ర్దక్షిణపార్శ్వే మలయాదుత్తరే కర్మభూమౌ భారత కింపురుష హరిరా వృత కురుభద్రాశ్వక రమణ మన్దహాస జిహ్వాదాఖ్యేతి నవఖండ ఖండితే! దండక చంపక విన్ధ్య విశా నైమిశ కదళిక బదరిక నహుష గుహ దేవదారు కారణ్యా ద్యేకాదశారణ్యాయుతే !!

అంగ వంగ కళింగ కాశ్మీర కాంభోజ సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర గుజరాష్ట్ర మగధమాళవ నేపాళ కేరళ చోళ పాంచాల బంగాళ గౌడ మళ యాళ సింహళ ద్రవిడ ద్రావిడ కర్ణాట లాట మరాట పానాట పాండ్య పుళిం దాంధ్ర కుక్కురు కురు గాన్ధార విదర్భ విదేహ బాహ్లీక బర్బర కేకయ కోసల కున్తల చ్యవన టెంకణ కొంకణ మత్స్య మద్ర ఘూర్జరాది చప్పన్నదేశవిశేష భూమిపాల విచిత్రితే !!

సామ్యవన్తి కురుక్షేత్రాది గంగా గోదావరీ భీమరధీ తుంగభద్రా కావేర్యాది మహానదీ విలసితే ! అయోధ్యా కాశీ పురుషోత్తమ రామేశ్వరాది మహాముక్తి స్థలయుతే ! శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే గంగాగోదావరి యో ర్మధ్య దేశే ॥

దేవతిర్యఙ్మనుష్య సకలజగత్స్రష్టుః పరార్ధద్విజీవినో బ్రహ్మణః ప్రథమపరార్ధే, పఞ్చశతాతీతే, ద్వితీయపరార్ధే, పఞ్చశతాదివర్షే, ప్రథమ మాసే, ప్రథమపక్షే, ప్రథమదివసే అహనిద్వితీయయామే, తృతీయముహూ ర్తే, త్రయోదశ ఘటికాయాం ద్విచత్వారిగ్ంశ ద్విఘటికాసు, గతాసు, త్రిచత్వారిగ్ంశ ద్విఘటికాయాం, శ్వేతవరాహకల్పే ॥

స్వాయంభువ, స్వారోచిషోత్తమ, తామస, రైవత, చాక్షుష, వైవస్వత, సూర్యసావర్ణి, చన్ద్రసావర్ణి, బ్రహ్మసావర్ణి, విష్ణుసావర్ణి, రుద్రసావర్ణి, రౌచ్య, భౌచ్య, చతుర్దశమన్వంతరాణాంమధ్యే, సప్తమేవైవస్వతమన్వంతరే, అష్టావిగ్ంశ న్మహాకలియుగే ॥

మత్స్యః కూర్మాది దశావతారాణాం మధ్యే నవమేబౌద్ధావతారే, యుధిష్ఠిరాదిషట్శకానాంమధ్యే తృతీయేశాలివాహనశకే ॥

పంచాశీతియుత శతసహస్ర వర్షాతీతే షష్ఠిశతే వర్తమానవ్యావహారికచాన్ద్రమానేన ప్రభవాది షష్ఠిసంవత్సరాణాంమధ్యే శ్రీ...నామ సంవత్సరే ...అయనే,...ఋతౌ,....మాసే,....పక్షే,....తిథౌ.....వాసరే, శుభనక్షత్రే, శుభయోగేశుభకరణ, ఏవంగుణవిశేషణవిశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్ ....గోత్రః,....నామధేయః ధర్మపత్నీసమేతోహం, శ్రీమతః....గోత్రస్య.... నామధేయస్య ధర్మపత్నీసమేతస్య మమఉపాత్తదురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థమ్ ॥

మమజన్మాభ్యాసాజ్జన్మ ప్రభృత్యే తత్క్షణ పర్యన్తం, మధ్యవర్తినకాలే బాల్య యౌవ్వన కౌమార వార్ధకేషు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాసు మనోవాక్కాయేన్ద్రియ వ్యాపారైః రహసి ప్రకాశేచ జ్ఞానతోఽజ్ఞానతశ్చ సమస్త పాపక్షయద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థమ్ ॥

మయాసః దశపూర్వేషాం దశాపరేషాం మద్వంశ్యానాం సర్వేషాం పితౄణాం నరకాదుత్తీర్య శాశ్వత బ్రహ్మలోకే నివాససిద్ధ్యర్థమ్ ॥

౧) గంగావాలుకాభిస్సప్త ఋషిమండలపర్యన్తం కృతరాశేర్వర్షసహస్రావసానే ఏకైకవాలుకాపకర్షక్రమేణ సర్వరాస్యపకర్షణ సమ్మిత కాలే బ్రహ్మలోకే నివాససిద్ధ్యర్థమ్ ॥

౨) తిలైస్సూర్యమండల పర్యన్తం కృతరాశేర్వర్ష సహస్రావసానే ఏకైకతిలాప కర్షక్రమేణ సర్వరాస్యపకర్షణసమ్మితకాలే బ్రహ్మలోకేనివాససిద్ధ్యర్థమ్॥

౩) యవైశ్చన్ద్రమండలపర్యన్తం కృతరాశేర్వర్షసహస్రావసానే ఏకైకయవాప కర్షక్రమేణ సర్వరాస్యపకర్షణసమ్మితకాలే బ్రహ్మలోకేనివాససిద్ధ్యర్థమ్॥

౪) మాషైర్ధ్రువమండలపర్యన్తం, కృతరాశేర్వర్షసహస్రావసానే ఏకైక మాషాప కర్షక్రమేణ సర్వరాస్యపకర్షణసమ్మితకాలే బ్రహ్మలోకేనివాస సిద్ధ్యర్థమ్॥

౫) గోలోమభిర్నక్షత్రమండలపర్యన్తం, కృతరాశేర్వర్షసహస్రావసానే ఏకైక లోమాపకర్షక్రమేణ సర్వరాస్యపకర్షణ సమ్మితకాలే బ్రహ్మలోకే నివాససిద్ధ్యర్థమ్॥

త్రిగుణీకృ తాఽ గ్నిష్టోమాఽ తిరాత్రాఽ ప్తోర్యామసాంతపన రాజ సూయ వాజపేయాఽ ఽ శ్వమేధాది శతక్రతు పుణ్యఫలావాప్త్యర్థమ్ ॥

మమ ఇహజన్మనిజన్మని రాజాధిరాజోభూత్వా సమస్త సుఖాన్యను భూయతతో విష్ణుసాయుజ్యఫలావాప్త్యర్థమ్॥ శ్రీలక్ష్మీనారాయణదేవతా ముద్దిస్య శ్రీలక్ష్మీ నారాయణదేవతా ప్రీత్యర్థం సాలఙ్కృత కన్యాదానమహం కరిష్యే ॥

## వర పూజ

కన్యాదాత వరునిశిరస్సుపై అక్షతలువేసి, పిమ్మటక్రిందివాక్యములుపలికి, వరునకు ఆసనమునిమిత్తము కూర్చునుఈయవలెను.

వరమభ్యర్చ్య॥ శ్రీలక్ష్మీనారాయణస్య స్వరూపవర ఇదమావాహనమ్॥

శ్రీలక్ష్మీనారాయణస్య స్వరూపవర ఇదమాసనమ్॥

కన్యాదాత క్రిందివాక్యముపలికి, కొత్తపళ్ళెమువరునిముందుఉంచి మొదట వరునికుడికాలు, తరువాత ఎడమకాలునూపళ్ళెములోపెట్టమని కోరవలెను.

పిమ్మట కన్యాదాతభార్య ఉదకముతో ఉన్న క్రొత్తచెంబు తీసుకొని కన్యాదాత

కుడివైపుకు వచ్చినిలబడి వరునిపాదములపై ఉదకము పోయుచుండగా కన్యాదాత తనరెండుచేతులతో మొదట వరునికుడిపాదమును, పిదప ఎడమపాదమును కడుగవలెను.

ఉభాభ్యా మిదంవాంపాద్యమ్॥

కన్యాదాత వరునికాళ్ళుకడుగునపుడు క్రిందిశ్లోకమునుఉచ్చరించవలెను.

శ్లో॥ నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి శిరోరుబాహవే।
సహస్రనామ్నే పురుషాయశాశ్వతే సహస్రకోటి యుగధారిణేనమః॥

పిమ్మట కన్యాదాతభార్యయథాస్థానమున కూర్చుండవలెను.

కన్యాదాత క్రిందివాక్యముచెప్పి వరునకుగంధము ఈయవలెను.

శ్రీలక్ష్మీనారాయణస్య స్వరూపవర భాగశః అమీవో గన్ధాః। సుగన్ధాః॥

కన్యాదాత క్రిందివాక్యముపలికి, వరునిశిరస్సుపైఅక్షతలు చల్లవలెను.

అలంకారార్థా ఇమే అక్షతాః॥సన్త్వక్షతాః ॥ సకలారాధనై శ్శోభనమస్తు॥

తదుపరి కన్యాదాత క్రిందిశ్లోకములను పలుకవలెను.

శ్లో॥ కన్యాం కనక సంపన్నాం కనకా భరణైర్యుతామ్ ।
దాస్యామి విష్ణవే తుభ్యం బ్రహ్మలోక జిగీషయా ॥
కన్యేమమాగ్రతో భూయాః కన్యేమేదేవి పార్శ్వయోః ।
కన్యేమే సర్వతో భూయా స్త్వద్దానా న్మోక్షమాప్నుయామ్ ॥
విశ్వంభర స్సర్వభూతా స్సాక్షిణ్య స్సర్వదేవతాః ।
ఇమాం కన్యాం ప్రదాస్యామి పితౄణాం తారణాయవై ॥
కన్యాం సాలంకృతాం సాధ్వీం సుశీలాయ సుధీమతే ।
ప్రయతోహం ప్రయచ్ఛామి ధర్మకామార్థ సిద్ధయే ॥

# గోత్ర ప్రవరోచ్చారణమ్

ఈసమయమున ముందు కన్యప్రవరను, పిదప వరునిప్రవరను చెప్పవలెను.

చతుస్సాగరపర్యన్తం గోబ్రాహ్మణేభ్య శ్శుభంభవతు ।

నప్త్రీం, పౌత్రీం, పుత్రీం, గోత్రోద్భవాం నామ్నీంకన్యామ్ ॥

చతుస్సాగరపర్యన్తం గోబ్రాహ్మణేభ్య శ్శుభంభవతు ।

నప్త్రే, పౌత్రాయ, పుత్రాయ, గోత్రోద్భవాయ శర్మణేవరాయ ॥

తాంబూలము, గుమ్మడిపండు, కొబ్బరిబొండము, కన్యదోసిలియందు ఉంచి, ఆమెదోసిలిని కన్యాదాతపట్టుకొని, వరునిదోసిలిలోఉంచగా, అపుడు కన్యాదాతభార్య కన్యాదాతకు కుడివైపుకు వచ్చి ఉదకము పోయుచుండగా కన్యాదాత **తుభ్యంప్రజాసహత్వ కర్మభ్యఃప్రతిపాదయామి**అనిపలికి, కన్యాదానముచేయ వలెను.

సూ॥ తుభ్యం ప్రజాసహత్వకర్మభ్యః ప్రతిపాదయామీతి కన్యాముదక పూర్వం దద్యాత్ ॥

వరుడు స్వస్తియని పలుకగా కన్యాదాత క్రింది మంత్రములను చెప్పవలెను.

స్వస్తీతి ప్రతివచనమ్ । **వరఃస్వస్తి** ॥

దేవస్యత్వా సవితుః ప్రసవేశ్వినోర్బాహుభ్యాం పూష్ణోహస్తాభ్యాం ప్రతిగృహ్ణామి రాజాత్వా వరుణోనయతు దేవిదక్షిణే ప్రజాపతయే కన్యామ్ ॥ తేనాఽమృతత్వమస్యామ్ । వయోదాత్రే । మయో మహ్యమస్తుప్రతిగ్రహీత్రే । కఇదంకస్మాఅదాత్ । కామః కామాయ । కామోదాతా । కామః ప్రతిగ్రహీతా । కామగ్ం సముద్ర మావిశ । కామేనత్వా ప్రతిగృహ్ణామి । కామైతత్తే । ఏషాతే కామదక్షిణా । ఉత్తానస్త్వాఙ్గీరసః ప్రతిగృహ్ణాతు ॥

కన్యాదానం తుభ్యమహం సమ్ప్రదదే ॥

కన్యాదానముచేయునపుడు **తుభ్యమహంసమ్ప్రదదే** అనిమాత్రమే పలుకవలెను, **నమమ** అనిఅనకూడదు. తరువాత కన్యాదాత క్రిందివాక్యము పలికి కన్యాదాన సాద్గుణ్యముకొరకు తనశక్త్యానుసారముగా వరునకుదక్షిణను ఈయవలెను.

కన్యాదానసాద్గుణ్యార్థం మనస్సంకల్ప దక్షిణాంతుభ్యమహం సమ్ప్రదదే నమమ ॥

తరువాత కన్యాదాత క్రింది వాక్యమును వరుని ఉద్దేశించి పలుకవలెను.

**దాతా** :- ధర్మేచ, అర్థేచ, కామేచ, త్వయైషా నాతిచరితవ్యా ॥

వరుడు క్రింది ప్రతివాక్యమును పలుకవలెను.

**వరః** :- నాతిచరామి ॥

## గృహ్యాగ్ని ప్రతిష్ఠాపనమ్

పిమ్మట వరుడు కన్యను అచ్చటనేఉంచి, హోమముచేయు చోటకువెళ్ళి, అచ్చట గృహ్యాగ్నిని ప్రతిష్ఠాపనచేయవలెను.

తత్రైవ కన్యాస్తే వరోవివాహ వేదికాయామగ్ని ప్రతిష్ఠాపనం కుర్యాత్ ॥

వరుడు ఆచమనము, ప్రాణాయామముచేసి, క్రిందివిధముగా సంకల్పించి, స్థండిలోల్లేఖనముమొదలు అలంకరణాంతము అగ్నిముఖములోవలెనే చేసి, వరుడుమరల యధాస్థానమునకువచ్చి కూర్చుండవలెను.

**వరః** :- ఆచమ్య....ప్రాణానాయమ్య....శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం సకలశ్రౌత స్మార్తనిత్య కర్మానుష్ఠాన యోగ్యతా సిద్ధ్యర్థం గృహ్యాగ్ని ప్రతిష్ఠాపనం కరిష్యే॥

స్థండిలం కృత్వోల్లిఖ్యాగ్నిం ప్రతిష్ఠాప్య। అగ్నింధ్యాత్వాలంకృత్య॥

ప్రాచీఃపూర్వముదక్సంస్థం....జాతవేదసేనమః॥

# మధుపర్కః

తరువాత కన్యాదాత వరునకు మధుపర్కమును ఇచ్చుటకై సంకల్పము చేయవలెను.

తతో మధుపర్కః । దాతాప్రాణానాయమ్య....శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం మయాక్రియమాణ కన్యాదానాఙ్గత్వేన వరంమధుపర్కేణ పూజయిష్యే॥

కన్యాదాత తొమ్మిదిదర్భలతో కట్టినకూర్చనుఆసనముగా ఉత్తరాగ్రముగా వరునకుఈయవలెను. ఎచ్చటవరునకు మధుపర్కపూజచేయుదురో అచ్చటదాత యిచ్చినకూర్చపై దాతకు అభిముఖముగా వరుడు క్రిందిమంత్రముచెప్పి ఉత్తరాగ్రమైన కూర్చపై కూర్చుండవలెను.

కూర్చను గురించిన వివరములు ఉపనయనమున చూడుడు. (పేజీ నెం169)

సూ॥ ఉదగ్రం కూర్చం ప్రయచ్ఛతి । యత్రాస్మా అపచితిం కుర్వన్తి తత్కూర్చ ఉపవిశతి । యథాపురస్తాత్ ॥

రాష్ట్రభృదస్యాచార్యా సన్దీమాత్వ ద్యోషమ్ ॥ అని బ్రాహ్మణుడు,

రాష్ట్రభృదసి సంమ్రాడా సన్దీమాత్వ ద్యోషమ్ ॥ అని క్షత్రియుడు,

రాష్ట్రభృదస్యధిపత్నా సన్దీమాత్వ ద్యోషమ్ ॥అని వైశ్యుడునూ కూర్చొనునప్పుడు చెప్పవలెను.

కన్యాదాత ఉదకములు తెచ్చి ఆపః పాద్యాః అని ఉచ్చరించవలెను.

సూ॥ ఆపఃపాద్యా ఇతి దాతాప్రాహ ॥

వరుడుక్రిందిమంత్రముచెప్పుచూకన్యాదాతచేతిలోనిఉదకమునుముట్టుకొనవలెను.

సూ॥ వరః ఉత్తరయాభిమన్త్ర్య ॥

ఆపఃపాదావనే జనీర్ద్విషన్తం నాశయన్తుమే । అస్మిన్కులే బ్రహ్మవర్చస్యసాని॥

వరుడుబ్రాహ్మణుడైనచోకుడికాలు ముందుఈయవలెను. శూద్రుడైనచో

ఎడమకాలు ముందుఈయవలెను. కాళ్ళుకడుగునపుడు వరుడుకన్యాదాతను చేతితో ముట్టుకొని, కాళ్ళుకడిగినపిమ్మట వరుడు ఆచమనముచేయవలెను. వరుని కాళ్ళుకడుగునపుడు కన్యాదాతభార్య కన్యాదాతకుడివైపుకువచ్చి, ఉదకము పోయ వలెను.

సూ॥ దక్షిణంపాదం పూర్వంబ్రాహ్మణాయ ప్రయచ్ఛేత్ । సవ్యగ్ం శూద్రాయ॥ ప్రక్షాళయితారముపస్పృశ్య । ఆచామేత్ ॥

వరుడు క్రిందిమంత్రముచెప్పి తనహృదయమును ముట్టుకొని, ఉదకము ముట్టుకొనవలెను.

సూ॥ ఉత్తరేణయజుషాత్మానం ప్రత్యభిమృశేత్ ॥

మయిమహో మయియశో మయీన్ద్రియం వీర్యమ్ ॥ అపఉపస్పృశ్య ॥

కన్యాదాత ఒకమట్టిపాత్రలో ఉదకముపోసుకొని ఆపాత్రకు అడుగునా, పైనాకూర్చలు వేసి **అర్హణీయా ఆపః** అని పలుకవలెను.

**దాతా:** సూ॥ కూర్చాభ్యాం పరిగృహ్య మృణ్మయే నార్హణీయా ఆపఇతి ప్రాహ॥

వరుడు క్రిందిమంత్రముచెప్పి, ఆఉదకమును అభిమంత్రించవలెను.

సూ॥ వరః ఉత్తరయాఽభిమన్త్ర్య ॥

ఆమాగన్ యశసావర్చసా సగ్ంసృజ పయసాతేజసాచ ।

తంమాప్రియం ప్రజానాం కుర్వధిపతిం పశూనామ్ ॥

పిమ్మట కన్యాదాత తన దోసిటయందున్న మట్టిపాత్రలోని ఉదకములో కొంతభాగము వరునిచేతిలోపోయగా, వరుడుక్రిందిమంత్రమును జపించవలెను.

సూ॥ అఞ్జలా వేకదేశ ఆనీయమాన ఉత్తరం యజుర్జపేత్ ॥

విరాజోదోహో ఽసి విరాజో దోహ మసీయ మమపద్యాయ విరాజ॥

వరుని దోసిలిలోపోయగా మిగిలినఉదకమును కన్యాదాతవరునిముందర

నేలమీద వంపుచుండగా వరుడుక్రిందిమంత్రముచెప్పవలెను.

సూ॥శేషంపురస్తాన్నినీయమాన ముత్తరయాఽను మన్త్రయతే ॥

సముద్రంవః ప్రహిణోమి స్వాంయోని మపిగచ్ఛత ।

అచ్ఛిద్రః ప్రజయా భూయాసం మాపరాసే చిమత్పయః ॥

కన్యాదాత ఒకపాత్రలో పెరుగు, తేనె రెండింటినికలిపి దానికంటే పెద్దదైన కంచుపాత్రచే మొదటి పాత్రనుకప్పి వాటిపై ఒకకూర్చను, వాటిక్రింద ఒక కూర్చను పట్టుకొని **మధుపర్కః** అని అనవలెను.

సూ॥ దధి మధ్వితి సగ్ం సృజ్య కాగ్ంస్యేన వర్షీయ సాపిధాయ కూర్చాభ్యాం పరిగృహ్య దాతా **మధుపర్కః** ఇతిప్రాహ ॥

మధుపర్కద్రవ్యములు పెరుగు, తేనె రెండుఅనికొందరు, నెయ్యితోకలిపి మూడుఅనిమరికొందరు, వేపుడుబియ్యము పేలపిండియుకలసి మొత్తము ఐదు ద్రవ్యములు అనికొందరుఅందురు.

త్రివృతమేకే ఘృతంచ పాఙ్క్తమేకే ధానాస్సక్తూగ్శ్చ ॥

వరుడు క్రిందిరెండుమంత్రములచే మధుపర్కమును అభిమంత్రించవలెను.

సూ॥ వరః ఉత్తరాభ్యామభిమన్త్ర్య ॥

త్రయ్యైవిద్యాయై యశోఽసి యశసో యశోఽసి బ్రహ్మణో దీప్తిరసి।

తంమా ప్రియం ప్రజానాం కుర్వధిపతిం పశూనామ్ ॥

ఆమాగన్ యశసా వర్చసా సగ్ంసృజ పయసా తేజసాచ ।

తంమా ప్రియం ప్రజానాం కుర్వధిపతిం పశూనామ్ ॥

**అమృతోపస్తరణమసి** అమృతాపిధానమసి అనునపుడు క్రింది విధముగా ఆచమనము చేయవలెను.

సూ॥ యజుర్భ్యామపఆచామతి పురస్తాదు పరిష్టాచ్చ॥

వరుడు క్రిందిమంత్రమునుచెప్పి ఒకమారు ఉదకమునుత్రాగవలెను.

అమృతోపస్తరణమసి ॥

పిమ్మట రెండుమార్లు ఆచమనముచేసి, క్రింది మంత్రముచెప్పి ఒకమారు, మంత్రములేకుండా మరొక రెండుమార్లు మధుపర్కము త్రాగవలెను.

కన్యాదాత వరునిచేతిలో మధుపర్కమువేయుట ఆచారము.

సూ॥ ఇత్యపఃపీత్వా । ద్విరాచమ్య । ఉత్తరయాత్రిః ప్రాశ్య ॥

యన్మధునో మధవ్యం పరమ మన్నాద్యం వీర్యమ్ । తేనాహం మధునో మధవ్యేన పరమేణా న్నాద్యేన వీర్యేణ పర మోఽన్నాదో మధవ్యో ఽసాని ॥ సూ॥ సకృన్మన్త్రేణ ద్విస్తూష్ణీమ్ ॥

వరుడు మధుపర్కముత్రాగినతరువాత క్రిందిమంత్రముపలికి, ఒకమారు ఉదకమునుత్రాగి, పిమ్మటచేతులుకడుగుకొని, మరల రెండుమార్లుఆచమనము చేయవలెను.

వరునికి ఇవ్వగా మిగిలిన మధుపర్క శేషమును కన్యాదాత తనకు దయా పాత్రులైన కుమారుడు, శిష్యుడుమొదలగు స్నాతకులకుఈయవలెను. క్షత్రియ, వైశ్యులు కన్యాదాతలైనచో ఆమధుపర్క శేషమును పురోహితునకు ఈయవలెను.

అమృతాపిధానమసి ॥

సూ॥ ఇత్యపఃపీత్వా హస్తంప్రక్షాళ్య ద్విరాచమ్య। అనుకంప్యాయ ప్రయచ్ఛేత్। ప్రతిగృహ్యైవ రాజా స్థపతిర్వా పురోహితాయ॥

తరువాత కన్యాదాత గౌః అని ఆవును చూపవలెను. ఆవుకు బదులుగా దర్భను చూపి, ఆదర్భను విడిచిపెట్టుట ఆచారము.

సూ॥ గౌః ఇతిగాంప్రాహ॥

ఆవును విడిచిపెట్టునపుడు వరుడుక్రిందిమంత్రములను జపము చేయవలెను.

సూ॥ యద్యుత్సృజే దుపాగ్ం శూత్త రాన్జపిత్వా॥

గౌః। యజ్ఞోవర్ధతాం యజ్ఞస్యవృద్ధి మనువర్ధాఽపచితి ర్యస్యపచిం మాకుర్వప చిత్తో ఽహం మనుష్యేషు భూయాసమ్। గౌర్ధేనుభవ్యా మాతా రుద్రాణాం దుహితా వసూనాగ్ స్వసాదిత్యానా మమృతస్యనాభిః॥ ప్రణు వోచం చికితుషే జనాయ మాగామనాగా మదితింవధిష్ట। పిబతూదకం తృణాన్యత్తు॥

వరుడు క్రిందివాక్యమును బిగ్గరగా అనవలెను. ఓముత్సృజత। (ఉచ్చైః।)

కన్యాదాత సిద్ధమైన అన్నమును వరునకు చూపి **భూతం** అనిఅనవలెను.

సూ॥ అన్నంప్రోక్త మపాగ్ం శూత్త రైరభిమన్త్ర్య॥ సిద్ధమన్నం **భూతమ్**॥ ఇతి **దాతా**ప్రాహ॥

వరుడుమెల్లగాభూతం అనిపలికి, క్రిందిమంత్రములుచెప్పి అభిమంత్రణ చేయవలెను.

**వరః** – భూతం।సావిరాట్।తన్మాక్షాయి।తస్యతేసీయ।తన్మఊర్జన్ధాః॥

వరుడు **ఓం కల్పయత** అనిబిగ్గరగాఅనవలెను. కన్యాదాతవరునినూతన వస్త్రాభరణాదులచే యథాశక్తిగా పూజింపవలెను.

సూ॥ **ఓంకల్పయత**। ఇత్యుచ్చైః। వరం వస్త్రాదిభిర్యథార్హంపూజయేత్॥

బ్రహ్మగారు క్రిందిమంత్ర,వాక్యములు చెప్పి, కన్యాదాతచే వధూవరులు ఇరువురి మధుపర్కములు, వరునకు ఉంగరము, వధువునిమిత్తముగా చేయించిన మంగళసూత్రమునూ వరునకుఇప్పించవలెను.

అర్చత ప్రార్చత। యువం వస్త్రాణిపీవసావసాథే యువో రచ్ఛిద్రా మన్తవో హసర్గాః। అవాతిరత మనృతాని విశ్వఋతేనమిత్రా వరుణా సచేథే॥

సుమఙ్గలీరియం వధూరిమాగ్ం సమేతపశ్యత।

సౌభాగ్యమస్యైదత్వా యాథాస్తం విపరేతన॥

హిరణ్యరూపస్సహిరణ్య సంద్రుగపాన్న పాత్సేదు హిరణ్యవర్ణః।

హిరణ్యయా త్పరియోనే ర్నిషద్యా హిరణ్యదా దదత్యన్న మస్మై॥

వేదమూర్తులైన బ్రహ్మశ్రీ(మధుసూదనశర్మగారు)తమకుమార్తె పాణి గ్రహణ సమయమందు లక్ష్మీనారాయణస్వరూపుడైనఅల్లునకు మధుపర్కద్వయము, సర్వాభరణములుఇచ్చి గౌరవించడమైనది.

వరుడు తనమధుపర్కములను మాత్రముధరించి, ఆచమనముచేసి, సభాయైనమః అనినమస్కరించవలెను.

**సుముహూర్తకాలే లగ్నాష్టక, మంగళాష్టక చూర్ణికాంచ పఠిత్వా ॥**

వధూవరులు జీలకర్ర బెల్లము పసుపు మొదలగు మంగళద్రవ్యములను తమ కుడిచేతులలో పట్టుకొని ఉండగా సుముహూర్తమునకు ముందుగా లగ్నాష్టక, మంగళాష్టక, చూర్ణికలను శుభకరమైన వేదానువాకములను బ్రహ్మగారు, ఇతర పండితులు పఠించవలెను.

## లగ్నాష్టకమ్

శ్లో॥ విఘ్నేశ్వరోవిఘ్నవిదూరకారీ నిర్విఘ్నకార్యేషు ఫలంసుసిద్ధమ్।
విఘ్నేశ్వరోనామ సురేషుపూజ్యో వధూవరాభ్యాం వరదాభవన్తు॥

శ్లో॥ తదేవలగ్నం సుదినంతదేవ తారాబలం చన్ద్రబలం తదేవ।
విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి॥౨

శ్లో॥ శ్రీరామపత్నీ జనకస్యపుత్రీ సీతాఙ్గనా సున్దర కోమలాఙ్గీ॥
భూగర్భజాతా భువనైకమాతా వధూవరాభ్యాం వరదాభవన్తు ॥౩॥

శ్లో॥ శివస్యపత్నీ గిరిరాజపుత్రీ సువర్ణదివ్యామ్బర రత్నభూషా।
కల్యాణగౌరీ శుభమఙ్గళార్థీ వధూవరాభ్యాం వరదాభవన్తు ॥౪॥

శ్లో॥ జానక్యాః కమలామలాఞ్జలి పుటే యాఃపద్మరాగాయితాః ।
న్యస్తారాఘువ మస్తకేచ విలసత్కున్ద ప్రసూనాయితాః ।
స్రస్తా శ్యామల కాయకాన్తి కలితా యాఇన్ద్ర నీలాయితాః ।
ముక్తాస్తాశ్శుభదా భవన్తు భవతాం శ్రీరామవైవాహికాః ॥౫॥

శ్లో॥ శ్రీభద్రాచల దివ్యభవ్య శిఖరఃప్రోత్తుఙ్గ సౌధాన్తరే ।
నిత్యశ్రీ మతిసున్దరే మణిమయే సింహాసనే భాసురే ।
స్వాసీనస్సహసీతయా ముదితయా వామాఙ్క విశ్రాన్తయా ।
శ్రీరామః పరిపూర్ణ శాశ్వతసుఖౌ కుర్యాదిమౌదమ్పతీ ॥౬॥

శ్లో॥ రాజన్తౌ రజపఞ్చబాణ సదృశౌ రాకేన్దు బిమ్బాననౌ ।
రమ్య భ్రూయుగళౌ రథోత్సవయుతౌ రమ్భాదినాట్యప్రియౌ ।
రత్నాం చన్ద్రమణీయ కఙ్కణధరౌ రాజాధిరాజార్చితౌ ।
దమ్పత్యోస్సుఖ సమ్పదే శుభవతాం శ్రీజానకీరాఘవౌ ॥౭॥

శ్లో॥ శ్రీమద్రత్న కిరీట మన్దరతరః శ్రీతాన్డవాడంబరః ।
శ్రీరఙ్గన్ముఖ చన్ద్రబిమ్బ లలితస్వానన్ద మన్దస్మితః ।
కర్ణ శ్రీకర చారు కుణ్డల మణీఖేల త్కపోలస్థలః ।
శ్రీరామః పరిపూర్ణ శాశ్వతసుఖౌ కుర్యాదిమౌదమ్పతీ ॥౮॥

సుముహూర్తస్సావధాన ! శుభలగ్నస్సావధాన ! లక్ష్మీనారాయణస్సావధాన!!

## మంగళాష్టకమ్

శ్లో॥ లక్ష్మీర్యస్య పరిగ్రహః కమల భూస్సూను ర్గరుత్మాన్రథః ।
పౌత్రశ్చన్ద్ర విభూషణ స్సురగురు శ్శేషశ్చ శయ్యాసనమ్ ।
బ్రహ్మాణ్డం వరమన్దిరం సురగణా యస్య ప్రభోస్సేవకాః ।

సత్రైలోక్య కుటుమ్బ పోషణపరః కుర్యాత్సదామఙ్గళమ్ ॥౧॥

శ్లో॥ బ్రహ్మా వాయు గిరీశశేష గరుడా దేవేన్ద్ర కామౌగురుః ।
చన్ద్రార్కౌ వరుణా ऽ నలౌ మనుయమౌ విత్తేశ విఘ్నేశ్వరౌ ।
నాసత్యౌ నిర్‌ఋతిర్మరు ద్గణయుతాః పర్జన్య మిత్రాదయః ।
సస్త్రీకా స్సురపుఙ్గవాః ప్రతిదినం కుర్వన్తువాం మఙ్గళమ్ ॥౨॥

శ్లో॥ విశ్వామిత్ర పరాశరౌర్వ భృగవో ऽ గస్త్యః పులస్త్యః క్రతుః ।
శ్రీమానత్రి మరీచి కౌత్స పులహా శ్శక్తి ర్వసిష్ఠో ऽ ఙ్గిరాః ।
మాణ్డవ్యో జమదగ్ని గౌతమ భరద్వాజాదయస్తాపసాః ।
సస్త్రీకా మునిపుఙ్గవాః ప్రతిదినం కుర్వన్తువాం మఙ్గళమ్ ॥౩॥

శ్లో॥ మాన్ధాతా నహుషో ऽ మ్బరీష సగరౌ రాజాపృథుర్హైహయః ।
శ్రీమాన్ధర్మసుతో నలో దశరథో రామో యయాతి ర్యదుః ।
ఇక్ష్వాకుశ్చ విభీషణశ్చ భరత శ్చోత్తానపాదో ధ్రువః ।
ఇత్యేతేభువి భూభుజః ప్రతిదినం కుర్వన్తువాం మఙ్గళమ్ ॥౪॥

శ్లో॥ అశ్వత్థో బదరీచ చన్దన తరుర్మన్దార కల్పద్రుమౌ ।
జమ్బూనిమ్బ కదమ్బ చూత సరళా వృక్షాశ్చయే క్షీరిణః ।
సర్వేతే ఫల మిశ్రితం వనచయం వైభ్రాజితం భ్రాజితమ్ ।
రమ్యం చైత్రరథం సునన్దన వనం కుర్వన్తువాం మఙ్గళమ్ ॥౫॥

శ్లో॥ గౌరీశ్రీ రదితిశ్చ కద్రు వినతే జ్యోతిశ్చ పూర్ణావతీ ।
సావిత్రీచ సరస్వతీచ సురభి స్సత్య వ్రతారున్ధతీ ।
స్వాహా జామ్బవతీచ రుక్మిభగినీ దుస్స్వప్న విధ్వంసినీ ।
వేలాచామ్బునిధే స్సమీన మకరాః కుర్వన్తువాం మఙ్గళమ్ ॥౬॥

శ్లో॥ ఆదిత్యాది నవగ్రహా శ్శుభఫలా మేషాదయో రాశయః ।
నక్షత్రాణి సయోగకాశ్చ తిథయ స్తద్దేవతా స్తద్గణాః ।
మాసాబ్దా ఋతవస్తథైవ దివసా స్సన్ధ్యాదయో రాత్రయః ।
సర్వే స్థావరజఙ్గమాః ప్రతిదినం కుర్వన్తువాం మఙ్గళమ్ ॥౭॥

శ్లో॥ గఙ్గా సిన్ధు సరస్వతీచ యమునా గోదావరీ నర్మదా ।
కృష్ణా భీమరథీచ ఫల్గు సరయూ శ్రీగణ్డకీ గోమతీ ।
కావేరీ కపిలా ప్రయాగ నిరతా వేత్రావతీత్యాదయః ।
నద్యశ్శ్రీ హరిపాద పఙ్కజభవాః కుర్వన్తువాం మఙ్గళమ్ ॥౮॥

సుముహూర్తస్సావధాన! శుభలగ్నస్సావధాన ! లక్ష్మీనారాయణస్సావధాన!!






స్వస్త్యష్టాశీతి సహస్రాణామ్ । ద్విజ గురు దైవత్యానామ్ । పాకశాసన హుతాశన దణ్డధర రక్షోనాథ పాశపాణి సమీరణ వైశ్రవణ శశిశేఖరాణామ్ । ఆయుష్మతః కమలాసనస్య యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యష్టాఙ్గ యోగనిరతానామ్ ॥

వశిష్ఠ వాలఖిల్య వైశమ్పాయన విశ్వామిత్ర దక్ష కాత్యాయన కౌండిన్య గౌతమాఙ్గీరస పారాశర వ్యాస వాల్మీకి శుక శౌనక సనక సనన్దన సనత్కుమార సనత్సుజాత జాబాలీ కుమ్భసమ్భవ పులస్త్య పులహాదిత్య తపోమతఙ్గజ కుత్స కశ్యప శన్డిల శాన్డిల్య పృషదశ్వ మన్దారపాలక కపిల కణ్వ గార్గేయ విభాన్డకాది ముఖ్యమునీనామ్ ॥

అరున్ధతీ లోపాముద్రా ఽహల్యా ద్రౌపదీ వినతా సీతా రుక్మిణీ స్వాహా జామ్బవతీ సత్యభామా దమయన్త్యాది పుణ్యసతీనామ్। హరిశ్చన్ద్ర నల పురుకుత్స పురూరవ సగర కార్తవీర్యాది షట్చక్రవర్తీనామ్ ॥ రామరన్తి మరుద్భగీరథ గజామ్బరీష నహుష దిలీప రఘ్వజ దశరథ శ్రీరామ భరత కుశలవాది మహారాజానామ్ ॥

పనసపాటలామ్ల క్రముకఖర్జూర నారికేళవకుళాశోక కాఞ్చనచన్దన కదళీధాత్రీకేతకీ సిన్ధువారాఽశ్వత్థ బదరీపున్నాగ చూతతాల హిన్తాలతమా లేత్యాది ముఖ్యతరూణామ్। ఋగ్యజుస్సామాథర్వణ వేదానామ్। కావ్యనాట కాలఙ్కార వ్యాకరణ భాట్టప్రాభాకరాది తర్కవేదాన్తాది శాస్త్రాణామ్। వజ్ర వైడూర్యగోమేధిక పుష్యరాగ మరకతమాణిక్య కౌస్తుభాదిముఖ్యమణీనామ్॥

అఖిలజగదానన్దకస్యభగవతో శ్రీవినాయకస్యప్రసాదేన అనయోర్ద మ్పత్యోః (అస్యవటోః)ఇక్షుక్షీర ఘృతగుడ గోరోజన మఙ్గళద్రవ్యాణి మఙ్గళ కరాణిభవేయుః। తిథివారనక్షత్ర లగ్నహోరాద్రేక్కాణ నవాంశద్వాదశాంశ త్రింశాంశత్రింశదంశకానాం నిరన్తరమనుకూలా స్సర్వేగ్రహాస్సనక్షత్రా శ్శుభ ఏకాదశస్థానఫలదా స్సుప్రీతాస్సుప్రసన్నా స్సుముహూర్తా వరదాభవన్తు॥

SANTOSH 1440 238333



## సుముహూర్తమ్

సుముహూర్తసమయమున వధూవరులు తమచేతులలోఉన్న జీలకర్ర బెల్లముమొదలగు మఙ్గళద్రవ్యములను ఒకరిశిరస్సుపై ఒకరుపరస్పరము ఉంచిన పిమ్మట క్రిందిమంత్రములనుచెప్పవలెను.

సానోదేవీ సుహవా శర్మయచ్ఛతు । ఆత్వాఽహారుషమన్తరభూః।
ధ్రువస్తిష్ఠా విచాచలిః । విశస్త్వా సర్వావాఞ్ఛన్తు । మాత్వద్రాష్ట్రమధిభ్రశత్।
ధ్రువాద్యౌర్ధ్రువా పృథివీ ।ధ్రువం విశ్వమిదంజగత్ । ధ్రువాహపర్వతాఇమే।
ధ్రువోరాజా విశామయమ్। ఇహైవైధి మావ్యధిష్ఠాః। పర్వతఇవావిచాచలిః।
ఇన్ద్రఇవేహ ధ్రువస్తిష్ఠ । ఇహరాష్ట్రముధారయ । అభితిష్ఠపృతన్యతః । అధరే
సన్తుశత్రవః । ఇన్ద్రఇవ వృత్రహాతిష్ఠ । అపఃక్షేత్రాణి సంజయన్న్ । ఇన్ద్రఏణ
మదీధరత్ ।ధ్రువం ధ్రువేణ హవిషా । తస్మైదేవా అధిబ్రవన్న్ । అయంచ
బ్రహ్మణస్పతిః ॥ ధ్రువంతే రాజావరుణో ధ్రువందేవో బృహస్పతిః । ధ్రువన్త
ఇన్ద్ర శ్చాగ్నిశ్చ రాష్ట్రం ధారయతాం ధ్రువమ్ ॥

వధూవరులమధ్యనఉన్న తెరనుతొలగించిన పిమ్మట క్రిందివాక్యముచెప్పి, పెద్దలందరూ వధూవరులశిరస్సులపై అక్షతలువేయవలెను.

అయం ముహూర్తస్సుముహూర్తో ఽస్తు ॥



## వధూ వర సమీక్షణమ్



తరువాత సుముహూర్తమందు వరుడు వధువునుచూచి క్రింది మంత్రమును జపించవలెను. వధూవరులు పరస్పరము చూచుకొనవలెను.

సూ॥ తతస్సుముహూర్తే స్వయందృష్ట్వా తృతీయాఞ్జపేత్ ॥

అభ్రాతృఘ్నీం వరుణా పతిఘ్నీం బృహస్పతే ।

ఇన్ద్రాపుత్రఘ్నీం లక్ష్మ్యన్తా మస్యై సవితస్సువ ॥

వరుడు వధువునొకసారిచూచి క్రింది మంత్రముచెప్పి వధువుదృష్టియందు తనదృష్టినినిలుపవలెను.

సూ॥ దృష్ట్వైవ చక్షుషీ ఉపసగ్ంహరతి। చతుర్థ్యా సమీక్షేత ॥

అఘోరచక్షు రపతిఘ్న్యేధి శివాపతిభ్య స్సుమనా స్సువర్చాః।
జీవసూర్దేవ కామాస్స్యోనా శంనోభవ ద్విపదే శఞ్చతుష్పదే ॥

కన్యాదాతదంపతులకు వారిఅత్తవారునూతనవస్త్రములను ఈయవలెను. వారుఆవస్త్రములనుధరించి, ఆచమనముచేసి, పెద్దలఆశీర్వచనముపొందవలెను.

తరువాత కన్యాదాతఆడపడచులు కన్యాదాతదంపతులకు మంగళహారతి ఇవ్వవలెను. పిమ్మట కన్యాదాతలుపీటలపైనుండిలేచి, సభకు నమస్కరించవలెను.

తదుపరి వధువుబుట్టలోనుండిలేచి, తూర్పుముఖముగాపెళ్లిపీటపై కూర్చొనగా, వరుడులేచి, ఆమెకుకుడివైపున తూర్పుముఖముగా కూర్చుండి ప్రాణాయామము చేయవలెను.

కృతప్రాణాయామౌ। ప్రాణానాయమ్య....శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం॥

వధూవరులిద్దరూసంకల్పించి మనమిరువురము పుణ్యకార్యములు చేయుచూ, సంతానమునుపొందుదుము. అనిదంపతులు క్రిందివాక్యమునుపలికి వరుడు అక్షతోదకములను వధువు కుడిచేతియందు విడువవలెను. ఆమె ఆఅక్షతోదకములను హరివేణమునందు విడువవలెను.

సూ॥ ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని ప్రజాశ్చోత్పాదయితవ్యాః॥ వధూవరౌ సంకల్పయుతః ॥

వరుడు పెళ్ళిపీటమీదనుండిలేచి, వధువుకుఎదురుగా పశ్చిమముఖముగా నిలబడి, తన కుడిచేతి బ్రొటనవ్రేలితోను, ఉంగరపు వ్రేలితోను ఒకదర్భను కొస క్రిందికుండునట్లు పట్టుకొని, క్రిందిమంత్రముచెప్పి వధువు కనుబొమల

నడుమ ప్రదక్షిణముగాతుడిచి, ఆదర్భను వధువువెనుకవైపు పడమటిదిక్కుగా పారవేసి ఉదకమును ముట్టుకొనవలెను.

సూ॥ అఙ్గుష్ఠే నోపమధ్యమయా చాఙ్గుళ్యా దర్భగ్ం సంగృహ్యోత్తరేణ యజుషా తస్యాభ్రువో రన్తరగ్ం సంమృజ్య ప్రతీచీనం నిరస్యేత్ ॥

ఇదమహం యాత్వయి పతిఘ్న్యలక్ష్మిస్తాం నిర్దిశామి ॥ అపఉపస్పృశ్య ॥

వధువుకాని, ఆమెబంధువులుకాని, వధూవియోగకారణముగా కన్నీరు విడచినచో వరుడుక్రిందిమంత్రమును జపించవలెను.

సూ॥ ప్రాప్తేనిమిత్త ఉత్తరాం జపేత్ ॥

జీవాగ్ం రుదన్తి విమయన్తే అధ్వరే దీర్ఘామను ప్రసితిం దీధియు ర్నరః।
వామం పితృభ్యో యఇదగ్ం సమేరిరే మయః పతిభ్యోజనయః పరిష్వజే॥

సరిసంఖ్యకలిగి తనకార్యమందు దృష్టికలిగినట్టి వేదవేత్తలైన బ్రాహ్మణులను వరుడు క్రిందిమంత్రముచెప్పి వధువుకు యుగచ్ఛిద్రాభిషేకముచేయు నిమిత్తము ఉదకముతెచ్చుటకు పంపవలెను.

సూ॥ యుగ్మాన్ సమవేతాన్మన్త్రవత ఉత్తరయాద్భ్యః ప్రహిణుయాత్॥

వ్యక్షత్క్రూర ముదచన్త్వాప ఆస్యై బ్రాహ్మణా స్నపనగ్ంహరన్తు।
అవీరఘ్నీ రుదచన్త్వాపః ॥

## దర్భేణ్వ లక్షణమ్

శ్లో॥ పంచభిర్వలయం దర్భైః వింశత్యావేష్టనంతతః ।
అన్తర్దశాఙ్గుళం ప్రోక్తం దర్భేణ్వస్యచ లక్షణమ్ ॥

ఐదుదర్భలను గుండ్రముగాచేసి ఇరువది దర్భలచే వాటిని చుట్టవలెను. మధ్య పది అంగుళములు వైశాల్యము ఉండవలెను.

# యుగచ్ఛిద్రాభిషేకమ్




వరుడు క్రిందిమంత్రముచెప్పిదర్భలతోపైప్రకారముచుట్టినకడియము ను వధువు శిరస్సుమీద ఉంచవలెను.

సూ॥ ఉత్తరేణయజుషా తస్యాశ్శిరసి దర్భేణ్వం నిధాయ॥

అర్యమ్ణో అగ్నిం పరియన్తు క్షిప్రం ప్రతీక్షన్తాగ్ శ్వశ్రో దేవరాశ్చ॥

క్రిందిమంత్రముచెప్పి, దుక్కికాడిని వధువుశిరస్సుకు తగులకుండా ఉత్తర ముపైపు పైకిపట్టుకొని, ఆకాడియొక్క దక్షిణపుతొలలు రెండింటిలో చివరిదానిని ఆ కడియముపై ఉంచవలెను.

సూ॥ తస్మిన్నుత్తరయా దక్షిణంబహిర్యుగచ్ఛిద్రం ప్రతిష్ఠాప్య॥

ఖేఽనసః ఖేరథః ఖేయుగస్యశచీపతే।

అపాలా మిన్ద్ర త్రిఃపూర్త్వ్య కరథ్సూర్య వర్చసమ్॥

వరుడు క్రిందిమంత్రముచెప్పి, ఆకాడిరంధ్రమందు బంగార(మంగళ సూత్ర)మునుఉంచి, పట్టుకొనవలెను.

సూ॥ ఛిద్రే సువర్ణ ముత్తరయాన్తర్ధాయ॥

శన్తే హిరణ్యగ్ంశముస్సన్త్వాపశ్శన్తే మేధీభవతుశంయుగస్యతృద్మ।

శన్త ఆపశ్శతపవిత్రా భవన్త్వథాపత్యా తన్వగ్ంం సగ్ంం స్పృజస్వ ॥

వరుడు క్రిందిఐదుమంత్రములనూచెప్పి, చివరఒకమారు కాడిరంధ్రములో ఉదకమునువేసి, ఆఉదకము బంగారముమీదుగా వధువుశిరస్సుపై పడునట్లు చేయవలెను. **ఇదియే యుగచ్ఛిద్రాభిషేకము.**

సూ॥ ఉత్తరాభిః పంచభిస్స్నాపయిత్వా ॥

౧. హిరణ్యవర్ణాశ్శుచయః పావకాఃప్రచక్రముర్ హిత్వావద్యమాపః।
శతంపవిత్రా వితతాహ్యాసు తాభిష్ట్వాదేవ స్సవితాపునాతు॥

౨. హిరణ్యవర్ణా శ్శుచయఃపావకా యాసుజాతః కశ్యపో యాస్వగ్నిః।
యా అగ్నిం గర్భం దధిరే సువర్ణాస్తాస్త ఆపశ్శగ్గ్స్యోనా భవన్తు ॥

౩. యాసాగ్ంంరాజా వరుణో యాతిమధ్యే సత్యానృతే అవపశ్యఞ్జనానామ్।
యా అగ్నిం గర్భం దధిరే సువర్ణాస్తాస్త ఆపశ్శగ్గ్స్యోనా భవన్తు ॥

౪. యాసాందేవా దివికృణ్వన్తి భక్షంయా అన్తరిక్షే బహుధా నివిష్టాః।
యా అగ్నిం గర్భం దధిరే సువర్ణాస్తాస్త ఆపశ్శగ్గ్స్యోనా భవన్తు ॥

౫. శివేనత్వా చక్షుషా పశ్యన్త్వాప శ్శివయా తన్వోప స్పృశన్తు త్వచన్తే।
ఘృతశ్చుత శ్శుచయోయాః పావకాస్తాస్త ఆపశ్శగ్గ్ స్యోనాభవన్తు ॥

(సకృత్స్నాపయతి)

## వధూ నూతన వస్త్ర ధారణమ్

వరుడు క్రిందిమంత్రముచెప్పి, మంగళసూత్రసహితముగా నూతన వస్త్రమును వధువుకు ఇవ్వవలెను.

సూ॥ ఉత్తరయా హతేన వాససాచ్ఛాద్య ॥

పరిత్వా గిర్వణోగిర ఇమాభవన్తు విశ్వతః ।

వృద్ధాయు మనువృద్ధయో జుష్టా భవన్తు జుష్టయః ॥

వధువుచే క్రొత్తచీరను ధరింపజేసిన తరువాత రెండుపళ్ళెములలోతడిపి ఆరబోసినబియ్యమును నిండుగాపోసుకొని, ఆపళ్ళెములలోఒక్కొక్క తమలపాకునువేసి, వాటిలోఒక్కొక్క మంగళసూత్రమునుఉంచి, వాటిపై మరల వేరొకతమల పాకును కప్పవలెను.

వరిపిండితోగాని గోధుమపిండితోగాని ముప్పదిరెండు ప్రమిదలనుచేసి, ఆవునేతితోతడిపిన వత్తులను పిండిప్రమిదలలో ఉంచి వాటిని రెండు పళ్ళెములలో ఒక్కొక్క పళ్ళెములో పదహారుచొప్పునఉంచి, దీపములు వెలిగించవలెను.

ఒక్కొక్కపళ్ళెమును ఇద్దరుముత్తయిదువులుచొప్పున నాలుగుపళ్ళెముల ను పట్టుకొని వధువుకుముందు ఒకదీపపుపళ్ళెము, దానివెనుకఒకబియ్యపుపళ్ళె మును, పిమ్మటవధువును, వధువువెనుక ఒకబియ్యపుపళ్ళెము, దానివెనుక ఒక దీపపుపళ్ళెమునుపట్టుకొని వధువునుకళ్యాణవేదికవద్దకు తీసుకురావలెను. ఇది ఆచారము,వధువువరునకు ఉత్తరమునకూర్చున్న పిదపఆచమనము చేయవలెను.



## మంగళసూత్ర ధారణమ్

పిమ్మట ముత్తయిదువులుతెచ్చిన దీపపుపళ్ళెములు దూరముగాఉంచి, తలంబ్రాలపళ్ళెములు వధూవరులకుఎదురుగా ప్రక్క ప్రక్కన ఉంచవలెను.

ఆ తలంబ్రాలపళ్ళెములలోగలమంగళ సూత్రములపై కప్పిన తమల పాకులనుతీసి, ఒకపళ్లెములోమంగళసూత్రముతోపాటు వధువునడుముకట్టు దర్భ త్రాడునుకూడాఉంచి, వధూవరులిరువురూ చెరిఒక పళ్ళెములోగల మంగళసూత్రములను షోడశోపచారములచే పూజించవలెను. ఈపూజలో కొబ్బరికురిడీలలో పాలుపోసి నివేదనచేయుట ఆచారము.

ప్రాణానాయమ్య....శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం సాగ్రవర్ష శతపర్యన్తం సుఖేన జీవన సిద్ధ్యర్థం యోక్త్రమాఙ్గళ్య పూజాం కరిష్యే। యోక్త్రమాఙ్గళ్యగౌరీ దేవతాభ్యోనమః ధ్యానావాహనాది షోడశోపచారై రభ్యర్చ్య॥

మంగళసూత్రములను పురోహితుడు పెద్దలకుచేతులయందు ముట్టిం చవలెను. ఒకముత్తయిదువుతో ఆమంగళసూత్రములను మిగిలినముత్తయిదు వులకు కంఠములయందు ముట్టించిన పిదపవరుడు వధువుకుఎదురుగా పశ్చి మముఖముగా తిరిగినిలబడి, క్రిందిశ్లోకమునుచెప్పి మంగళసూత్రములను వధువు కంఠసీమయందు మూడేసిముడులువేసి కట్టి, పిదప ముడులవద్ద కుంకు మ అద్దవలెను. పిమ్మటవరుడు వధువుకుడిచేతిప్రక్కన కూర్చొనవలెను.

శ్లో॥ మాఙ్గళ్య తన్తునా నేన మమజీవన హేతునా।
కంఠేబధ్నామి శుభగే త్వంజీవ శరదాంశతమ్॥
(ఇతి వధూకంఠే మఙ్గళసూత్రం బధ్వా॥)

క్రిందివాక్యముపలికి సభాసదులందరూ వధూవరుల శిరస్సులపై అక్షతలు వేయవలెను.

మాఙ్గళ్యధారణముహూర్త స్సుముహూర్తో ఽ స్తు॥

## యోక్త్రలక్షణమ్

శ్లో॥ యుగ్మ దర్భకృతం యోక్త్రం ద్వాత్రింశదంగుళోన్నతమ్।
చతుర్వింశతి దర్భైశ్చ జ్ఞేయం యోక్త్రస్య లక్షణమ్॥

ఇరువది నాలుగుదర్భలచేత ముప్పదిరెండుఅంగుళముల పొడవుఉండు నట్లు రెండుపేటలాపేనిన దర్భత్రాడును యోక్త్రము అందురు.

## యోక్త్రధారణమ్

వరుడు క్రిందిమంత్రముచెప్పి, వధువువైపుకుతిరిగి యోక్త్రమనుదర్భ త్రాడును ఆమెమొలకు కట్టవలెను.

సూ॥ ఉత్తరయా యోక్త్రేణ సన్నహ్యతి ॥

ఆశాసానా సౌమనసం ప్రజాగ్ం సౌభాగ్యం తనూమ్ ।

అగ్నే రనువ్రతా భూత్వా సన్నహ్యే సుకృతాయ కమ్ ॥

దర్భత్రాడును వధువుబొడ్డుకు ఉత్తరమున పీటముడివేసి కట్టి ప్రదక్షిణము గా బొడ్డుమీద నుండిజరిపి బొడ్డుకుదక్షిణమున ఆముడిఉండునట్లు త్రిప్పవలెను.

ఉత్తరేణ నాభింనిష్టర్క్యగ్రన్థిం బధ్వా ప్రదక్షిణం పర్యూహ్య దక్షిణేన నాభిమవస్థాపయతి ॥



## అక్షతారోపణమ్

తరువాత తలంబ్రాలను పోయించవలెను.

తతః ఆర్ద్రాక్షతారోపణం కుర్యాత్ । తతః కపిలావాచనమ్ ॥

వరుడు వధువుదోసిటయందు పాలతోఅభిఘరించి రెండుమార్లు బియ్య

మునుఉంచి, పిమ్మట రెండుమార్లు అభిఘరించవలెను. తదుపరి పురోహితుడు వరుని దోసిటయందు పాలతో అభిఘరించి రెండుమార్లు బియ్యమును ఉంచి, పిమ్మట రెండుమార్లు అభిఘరించవలెను.

తరువాత వధువుదోసిటపైన వరునిదోసిలిని ఉంచి ఉదక పాత్రయందలి ఉదకమును కొంచెముకొంచెముగా పోయుచూ క్రిందివాక్య, అనువాకములను చెప్పవలెను. తలంబ్రాలు పోసుకొనునపుడు వధూవరుల దోసిలలో కొబ్బరి కురిడీ చిప్పలుఉంచి, వాటితో పోసుకొనుట ఆచారము.

వరః పయసా వధ్వఞ్జలా వుపస్తీర్య । ద్విస్తండులానోప్య ద్విరభిఘారయాతి । వరాఞ్జలావన్యఃకుర్యాదేవం వధ్వఞ్జలే రుపరిస్థాప్య ॥ సోదకం కలశమాదాయ ॥

కపిలాగ్ స్మారయన్తు । బహుధేయంచాస్తు । పుణ్యం వర్ధతాగ్ం శాన్తిరస్తు । పుష్టిరస్తు । తుష్టిరస్తు । వృద్ధిరస్తు ।అవిఘ్నమస్తు । ఆయుష్యమస్తు । ఆరోగ్యమస్తు । స్వస్తిశివంకర్మాస్తు । కర్మసమృద్ధి రస్తు । దంపత్యోః స్వగ్రహే సనక్షత్రే సహసోమేన క్రియేతాగ్ం శాన్తిరస్తు ॥

ప్రజాపతి స్త్రియాం యశః । ముష్కయో రదధాథ్సపమ్ । కామస్య తృప్తి మానన్దమ్ । తస్యాగ్నే భాజయే హమా । మోదః ప్రమోద ఆనన్దః । ముష్కయోర్ని హితస్సపః । సృత్వేవ కామస్య తృప్యాణి । దక్షిణానాం ప్రతి గ్రహే । మనసశ్చిత్త మాకూతిమ్ । వాచస్సత్య మశీమహి । పశూనాగ్ం రూపమన్నస్య । యశశ్శ్రీశ్శ్రయతాం మయి । యథాహమస్యా అతృపగ్గ్ స్త్రియై పుమాన్ ।యథాస్త్రీ తృప్యతి పుగ్ంసి ప్రియే ప్రియా । ఏవం భగస్య తృప్యాణి। యజ్ఞస్యకామ్యః ప్రియః । దదామీత్యగ్ని ర్వదతి । తథేతి వాయురాహతత్। హన్తేతి సత్యంచన్ద్రమాః । ఆదిత్యస్సత్యమోమితి । ఆపస్తథ్సత్యమా

భరన్న్। యశోయజ్ఞస్య దక్షిణామ్ ॥

ఒకరి శిరస్సుపై ఒకరు క్రిందివిధముగా తలంబ్రాలు పోసుకొనవలెను.

సూ॥ అన్యోన్యగ్‌ం శిరసి తండులారోపణం కుర్యాత్।

వధూవరులుఇరువురూ క్రిందిమంత్రముచెప్పి, వరుడు వధువుశిరస్సుపై ముందుగాతలంబ్రాలుపోయవలెను. పిమ్మట వధువు వరునిశిరస్సుపై తలంబ్రాలు పోయవలెను.

సూ॥ పూర్వం వరో వధ్వాశ్శిరసి ప్రాపయేత్ ॥

ప్రజామే కామః సమృధ్యతామ్ ॥

పైక్రియ అంతయూ మొదటిసారివలెనే చేసి, అనువాకము అంతయూ చెప్పి, పిమ్మటవధూవరులు ఇరువురూ క్రిందిమంత్రముచెప్పి, వధువు ముందుగా వరునిశిరస్సుపై తలంబ్రాలు పోయవలెను. తరువాత వరుడు వధువుశిరస్సుపై తలంబ్రాలుపోయవలెను.

సూ॥ ద్వితీయపర్యాయే వరస్యశిరసి పూర్వంప్రాపయేత్ ॥

పశవోమే కామః సమృధ్యతామ్ ॥

పైక్రియఅంతయూ మొదటిసారివలెనేచేసి, అనువాకము అంతయూ చెప్పి, పిమ్మటవధూవరులు ఇరువురూక్రింది మంత్రముచెప్పి, వరుడు వధువు శిరస్సుపై ముందుగా తలంబ్రాలుపోయవలెను. పిమ్మటవధువు వరునిశిరస్సుపై తలంబ్రాలు పోయవలెను.

సూ॥ తృతీయపర్యాయే వధ్వాశ్శిరసి పూర్వంప్రాపయేత్ ॥

యజ్ఞోమే కామః సమృధ్యతామ్ ॥

నాలుగవమారు మంత్రములేకుండా మొదటిసారివలెనే క్రియమాత్రము అంతయూచేసి వధూవరులుఇరువురూ ఒకరిశిరస్సుపై మరొకరు ఒక్కమారుగా క్రిందిమంత్రముపలికి తలంబ్రాలుపోసుకొనవలెను.

సూ॥ చతుర్థే అన్యోన్యం యుగపత్॥ తూష్ణీం చతుర్థమ్॥

శ్రియోమే కామః సమృధ్యతామ్ ॥



## మాలికా ధారణమ్

తదుపరి బ్రహ్మగారు లగ్నాష్టకములు పఠించుచుండగా వధువు తనస్థానమునుండిలేచి, వరునికిఎదురుగా పశ్చిమముఖముగానిలచి, పూలదండతీసుకొని వరునిమెడలోవేసి, పిమ్మట కర్పూరపు దండకూడా వరునిమెడలోవేసి, యథాస్థానమున కూర్చొనవలెను.

వరుడు తనుకూర్చున్నచోటనే కూర్చొని, ముందుగా పూలదండ తీసుకొని వధువుమెడలోవేసి, పిమ్మట కర్పూరపుదండకూడా వధువుమెడలో వేయవలెను.

## బ్రహ్మముడి



క్రింది అనువాకముచెప్పుచూ రెండుతాంబూలములందు ఎండుఖర్జూరపుకాయ, దక్షిణఉంచి, వాటినివరునికండువాచెంగుచివర, అట్లేవధువుచీరచెంగుచివరనకట్టి - ఆరెండుచెంగులనుకలిపి బ్రహ్మగారుముడివేసి, దంపతులు ఇరువురిపైన అక్షతలు వేయవలెను. ఇదియే బ్రహ్మముడి.

సూ॥ తతోవధూవర చేలాఞ్చలయోః సువర్ణఫలసహితం ఉత్తరేణానువాకేన బ్రహ్మగ్రన్థిం గ్రథ్నాతి ॥

యోగక్షేమస్య క్లృప్త్యై। యుక్తంక్రియాతా ఆశీఃకామేయుజ్యాతా ఇతి। ఆశిష స్సమృద్ధ్యై। గ్రన్థింగ్రథ్నాతి। ఆశిష ఏవాస్యాం పరిగృహ్ణాతి। పుమాన్

